దీపికా -: అస్మాదాత్మనిష్ఠాద్భక్తియోగనిష్ఠస్య శ్రైష్ఠ్యం ప్రతిపాదయన్ యథోపక్రమం ఉపసంహరతి—

యే తు = పురుషాః, శ్రద్దధానాః = శ్రద్ధావంతః, మత్పరమాః = మదేకప్రయోజనాః, యథోక్తం = మయ్యావేశ్య మనో యే మా మిత్యాదినా మదుక్తప్రకారం, ధర్మ్యామృతం = ధర్మా దనపేత మమృతవద్భోగ్యభూతం చ, ఇదం = భక్తియోగాఖ్యం మదుపాసనం, పర్యుపాసతే = పరంపరం మనుతిష్ఠంతి, తే, భక్తాః, మే = మమ, అతీవ, ప్రియాః, మదాత్మభూతా ఇత్యర్థః ॥ 20 ॥

ఇతి శ్రీభగవద్గీతాభాష్యార్థ సంగ్రహతాత్పర్యదీపే శ్రీ వరవరముని విరచితాయాం బాలబోధిన్యపరాభిధానాయాం గీతార్థ సంగ్రహ దీపికాయాం

ద్వాదశోఽధ్యాయః

---

శ్రీరస్తు

గీతార్థసంగ్రహః

శ్లో॥ భక్తేః శ్రైష్ఠ్యముపాయోక్తిః అశక్తస్యాత్మనిష్ఠతా।
తత్ప్రకారా స్త్వతిప్రీతిః భక్తే ద్వాదశ ఉచ్యతే॥

టీ -: భక్తేః శ్రైష్ఠ్యం = (శీఘ్రఫలప్రద మగుటచేత) భక్తియోగముయొక్క శ్రేష్ఠత్వము; ఉపాయ + ఉక్తిః = (భక్తిరూప) ఉపాయము; అశక్తస్య = భక్తియోగము ననుష్ఠింప శక్తిలేనివానికి; ఆత్మనిష్ఠతా = కేవలాత్మనిష్ఠత్వము; తత్ + ప్రకారాః = వాని విధములు; భక్తే = భక్తునియందు; అతి ప్రీతిః = (భగవంతునికి గల) అతిశయితప్రేమ; ద్వాదశే = ఈ ద్వాదశాఽధ్యాయమునందు; ఉచ్యతే = చెప్పబడుచున్నది.

తా -: మోక్షసాధనములలో భక్తి శీఘ్రముగ ఫలము నొసంగుటచే శ్రేష్ఠమైన దనియు; అది ఉపాయ మనియు, దానిని అనుష్ఠింపలేనివానికి కర్తవ్యమైనఆత్మనిష్ఠ దాని ప్రకారములును; భగవంతునికి భక్తునియందు గల ప్రేమాఽతిశయము ఈ ద్వాదశాఽధ్యాయమునందు చెప్పబడినవి.

---

## ద్వితీయషట్కము సమాప్తము.

